ఓమ్

పరబ్రహ్మణేనమః.

బ్రహ్మానందప్రణీతమగు

# యోగము

పరోక్షము : అపరోక్షము.

రా మ కు మా రు ని చే

నాంధ్రీకృతము.

( పండితులచేఁ బరిష్కృతము. )

మొదటికూర్పు 750.



శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల

పిఠాపురము.

1915.

వెల రు 0-2-6.



# అంకితము.

---

సత్యశౌచాదిసద్గుణసంపన్నుండును శ్రీవేంకటరామనామాంకితుండును, పుణ్యలోకవాసియు నగుమత్ప్రియజనకునిపవిత్రచరణారవిందంబులకు వందనశతసమేతంబుగ దీని నర్పించుచున్నాఁడను.

గ్రంథకర్త.

# విషయసూచిక.







# [illegible] యోగము.

[illegible]

[illegible]

హిందువులభక్తిజీవనమందుఁ బ్రాముఖ్యము చెందినయవస్థాభేదములలో నొకటి యోగము. ఇయ్యది ప్రాచ్యమతసాధనలలో మిక్కిలి యద్భుతమైనది. పాశ్చాత్యమతశిక్షలలో నిట్టిది గానరాదు. ఆధునికశాస్త్రజ్ఞులకును, తత్త్వవేత్తలకును నిది దురవగాహము. క్రైస్తవహేతువాదుల కిది కేవలము మౌఢ్యము, అవివేకమును. కాని, ఈహిందూయోగములో భ్రమప్రమాదజనితములగుదోషములు కలసియున్నవని యొప్పుకొనక తప్పదు. అత్యంతాభిమానులకుఁ గూడ దీనివిపరీతస్వరూపములయందు ననేకము లగునతాత్త్వికములును నసంగతములును దప్పక కన్పట్టును. కాని మన కిపుడు విపరీతముల తోడను వికృతులతోడను బనిలేదు. తత్త్వపరిశీలకునకుఁ గావలసినది యంతస్సారమే కాని ఆగంతుకము లగుమార్పులతో నాతనికిఁ బనిలేదు. ఈ రెంటియొక్కయు విభాగజ్ఞానశూన్యత వివేచకునిబుద్ధియొక్కసమతాభావమును, మాంద్యమును బ్రకటించును. ఆకారణమున నాతఁడు నిష్పాక్షికబుద్ధితో నభిప్రాయ మీయఁజాలఁడు. ప్రాచీనమగునీహిందూజాతియొక్కయాధ్యాత్మికజీవనము న్యాయదృష్టితోఁ బరిశీలింపఁ బూనుకొనినయెడలఁ బైపైనమాత్రము చూచుటచేఁ దృష్టిచెందక ఆధారభూతము లై లోపల నిమిడియున్నముఖ్యసిద్ధాంతములను జాగరూకతతో నారయుట యావశ్యకము. కనుక,

మన మిపుడు హిందువులజాతీయజీవితముతో సమ్మిళిత మైనట్టియు, వారిమానసికాభివృద్ధియొక్కయవస్థాంతరములఁబ్రత్యేకముగస్ఫూర్తి నందునట్టియు నీయోగముయొక్క నిజమగుస్వభావస్వరూపముల సమబుద్ధితోఁ బరిశీలింపఁ బ యత్నింతము.



# యోగమననేమి.



యోగమునకు శబ్దార్థము అనుసంధానము. జీవాత్మ తన వైహికపాపావయందుఁ బరమాత్మకు భిన్నమై వ్యవహితమై యుండును. ఈ రెంటికిని సమాధాన మావశ్యకము. సమాధానమే కాక, అంతకంటె నెక్కుడగు ననుసంధానమే పరమప్రయోజనముగా సాధింపఁబడుచున్నది. దేవునితో నిట్టియనుసంధానమే హిందూ యోగముయొక్క నిజమగు రహస్యము. ఇదియే యాధ్యాత్మికైక్యావాప్తి. ఏకత్వమందు ద్విత్వజ్ఞానము. ద్వైతమం దద్వైతసిద్ధి. తత్త్వజిజ్ఞాసువును మననశీలుఁడు నగుహిందువున కిదియే యుత్తమలోకావాప్తి; మోక్షము. దీనికంటె నాతఁడు కోరుముక్తి మఱి లేదు. పృధగ్భావము, వియోగము, వ్యవహితత్వము, భేదానుభవము, ద్వైత ఠి, అహంభావము, ఇదియే యాతనిదృష్టియందు సమస్తపాపములకును, దుఃఖములకును మూలము. ఈశ్వరునితో నైక్యముఁ జెంది యాతనిసాయుజ్య మెఱిఁగి యనుభవించుటయే యాతనికి నిజమగు మోక్షము. దీనినే యాతఁడు సదా కాంక్షించును. పరమానందమయ మగునీదివ్యమానవత్వమును సాధించుటకే యెంతయుఁ బ్రయాసముతో నాతఁడు సదా ప యత్నము సేయును. ఆతఁ డొక్కసారి యీపరమపదవిని జెందెనేని సమస్తదుఃఖములకును, భ మలకును, పాపములకును, గలుషములకును నతీతుఁడై యాత్మశాంతి నందును. ఉపాసనలు, పా నలు; నిత్యకర్మలు, నైమిత్తిక

ములు; ధ్యానములు, త్యాగములు; అన్నియు నీశాంతిధామము నందుట కాతనికి సాధనములును, మార్గములును మాత్రమే యై యున్నవి.





# యోగత్రయము.



భిన్నము లగుమూడుకాలములం దీయోగము—ఈశ్వరసాయుజ్యము—సహజముగా త్రివిధము లగురూపభేదముల నొందును; అనఁగా, నిది మూడువిధముల సాధింపఁబడునని చెప్పనొప్పు. మొదటిది ప్రాథమిక మగువైదికకాలమందుఁ బ్రకృత్యాత్మకుఁడగునీశ్వరునితో ననుసంధానము. ఇదియే పరోక్షయోగము. రెండవది యుపనిషత్కాలమందలి జీవాత్మపరమాత్మల యనుసంధానము. ఇదియే యపరోక్షయోగము. మూడవది పౌరాణికకాలమందు ఇతిహాసప్రసిద్ధుఁ డగుభగవానునితో ననుసంధి. ఇదియే భక్తి; భక్తియోగము. ఇంచుక యోచించునెడల తత్క్షణమే విచిత్రము,వ్యంజకమును నగుదీనిసాదృశ్యము వ్యక్తమగును.హిందూమతమునందలి "త్రికము" నకును క్రైస్తవమతమునందుఁ గల "త్రికము" నకును గలసజాతీయసాదృశ్యము విస్పష్టము. పరిణామక్రమమందు మాత్రమే యీరెంటికిని భేదము గలదు. తదితరములగునన్నివిషయములందును వీనికి సంబంధించినయాశయముల యొక్కయు భావములయొక్కయు సామ్య మత్యద్భుతము. క్రైస్తవమతమునందు పిత, పుత్త్రుఁడు, పరిశుద్ధాత్మ. హిందూమతమునందు ముందుపిత, పరిశుద్ధాత్మ, ఆవెనుక పుత్త్రుఁడు. ఈభావత్రయము త్రివిధ మగునీశ్వరావిర్భావముఁ బ్రదర్శించుచు హిందూమత

చారిత్రమును మూడు వేలువేలుభాగములుగ విభజించుచున్నది. ఈభావత్రయము మానవసంఘముయొక్కయుం బ్రత్యేకవ్యక్తుల యొక్కయు పరిణామములో నెట్టిసహాజకమము ననుసరించునో నానాపభేదములతో మానవకోటియొక్క జీవచారిత్రమం దెట్లు పరివర్తనము నల్పుచుండునో ఇచ్చట విమర్శింప ననావశ్యకము.

# వైదికయోగోత్పత్తి.

ప్రప్రథమమున మనుష్యునియాత్మ ప్రకృతియం దీశ్వరుని
దర్శింపఁ బ్రయత్నించును. అప్పు డాతనియాధ్యాత్మిక జ్ఞానము
ప్రాకృతికము. ప్రకృత్యారాధనమే యాతనిపురాతనోపాసనాపద్ధతి.
అపుడపుడే భౌతికప్రపంచమందుఁ బ్రవిష్టుఁ డగుటచే సృష్టివైచి
త్ర్యములచే నాతనిమానసము విస్మయోపహత మగుచున్నది.
అతఁడు దేనిని జూచినను హృదయ మాశ్చర్య పూరిత మగును. రవి
చంద్రతారాగణములతోడను, నదీశైలసముద్రములతోడను, ఖనిజ
తరుజంతుసంతతులతోడను గూడి విశ్వము మహోజ్జ్వలము మనో
హరమును మాత్రమే కాదు. ఈసృష్టియంతయు చలనోన్మేషసహిత
మై వృద్ధిఁ జెందుచుండును. కనుక నిది యద్భుతావహ మగుటయే
కాక, దురవగాహముగూడ నై యుండును. గ్రహోపగ్రహనదీ
మారుతములసంచలనమును జూచియు వివిధములై విచిత్రములై
సముచితావయవసంపత్తితో సౌందర్యమున కాకరములై వికాసము
నందు జంతుసంతతిని వృక్షరాశిని దిలకించి విస్మయావిష్టుఁడై
మానవుఁ డీవిశ్వముయొక్క చలనోన్మేషములకు దుర్జ్ఞేయ మగుమహా
కారణ మెద్దియొక్కో యని వితర్కించును. భయవిస్మయాయత్తచిత్తుఁ
డై యాతఁడు నమస్కరించును; సాష్టాంగప్రణామము సేయును;
పూజించును; అర్చించును; స్తుతించును; శ్లాఘించును. కాని యెవరి

నుద్దేశించి తా నిట్లుచేయునదియు నాతఁడును జెప్పఁజాలఁడు. ఆతఁ డత్యంతము బాలుఁడు, నజ్ఞుఁడును; అమాయికుఁడు, నశిక్షితుఁడును; కాన, దాను బూజించున దిద్దియని వివరింపఁజాలఁడు. ఆతఁడు సహజేంగితజ్ఞానమాత్రప్రేరితుఁడుగాని వితర్కవిమర్శనములసాహాయ్యము గొనఁడు. ఆతనిభావంబు లింకను నపరిష్కృతంబులు. శాస్త్రమింకను వానిరూపనిరూపణము చేయలేదు. గాఢేచ్ఛాప చోదనలచేఁ బే రితుఁడై యాతఁడు కార్యముల నల్పునేకాని తనసం ల్పవ్యాపారంబులకుఁ గారణంబు లిట్టివనివివరింపఁజాలఁడు. ఆతఁడు ధార్మికుఁడుమాత మే; తాత్త్వికుఁడు గాఁడు. విస్మయము నేని భక్తినేని కృతజ్ఞతనే వు కొల్పుదేనినైన నతఁ డారాధించును. ఉన్నతాకాశమును జూచి భక్తితో నమస్కరించును. ఉఱుము, మెఱుపు, వాన వీనికిఁ బా నాస్తుతుల నాచ రించును. తనకు మహోపకృతి ల్పినవారికివలెనే సూర్యునకును, అగ్నికిని, వాయువునకును, నదులకును నాతఁడు కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించును. ఉషఃకాల మెంతయు సుందరము మనోహరమును. దీనిని జూచి నంతనే యాతఁడించుకేనియు సంశయింపక పూజించును.సూరే ంద్ర వాయువరుణుల నాతఁ డాహ్వానముచేసి యర్చించును.



# విశ్వదేవార్చనమునుగాదు:

# బహుదేవార్చనమునుగాదు.



ఈతని విశ్వదేవార్చకుఁ డనుటకుఁ గాని, బహుదేవార్చకుఁ డనుటకుఁ గాని వలనుపడదు. ఈతనిభక్తివిశ్వాసము లింకను నియత స్వరూపమును గ్రహింప లేదు. కాన, నివి మనకుఁ దెలియుమత సిద్ధాంతములలో వేని ననుసరించి యుండునో చెప్ప నవకాశము లేదు. ఆధ్యాత్మికజీవనచరిత మందు భావన లపరిష్కృతములుగను, వాసనలు బీజరూపములుగను నుండుతఱి వానిని క్రోడీకరించుటకు శాస్త్రమర్యాద గాని తత్త్వసిద్ధాంతము గాని చాలదు. ఉదయ కాలము రాత్రియును గాదు; పగలును గాదు. భ్రూణము చేతనమును గాదు; అచేతనమును గాదు. మానవుని ప్రారంభమతజీవనము నట్టిదే. ఉన్న దేదియో యున్నది. ఎట్లున్నదో యట్లే దాని గ్రహింప వలయును. తత్త్వశాస్త్రజ్ఞుఁడు దీని కొకనామ మియ్యఁగోరును. ఆతని కది సహజము. కాని విషయము లెల్లపుడును మనము గోరు నటులుమాత్ర మె యుండవు. దోషైకదృక్కును, అసహనశీలుఁడు నగువిమ ర్శకుఁడు మానవునియాధ్యాత్మికబాల్యదశ విశ్వదేవార్చన మనిగాని బహుదేవార్చనమనిగాని దూషింపఁ బ యత్నించుచు సిద్ధాంతీకరణమునకు దొరకొనకుండుఁ గాక! అపా మును గల్పింప

వీలగుటకై మాఱుపేరిడక ప్రకృతియొక్క నిజస్వరూపనిరూపణము చేసి యాథార్థ్యమును బడయుటయే యాతనికిఁ గర్తవ్యము. మానవుఁడప్రయత్నముగఁ జేయు ప్రకృత్యారాధనము వాస్తవముగ విశ్వదేవార్చనము గాని బహుదేవార్చనము గాని కాదు. అది కేవలము శక్త్యారాధనము. ఈభౌతికప్రపంచములోని యసాధారణము లగుప్రకృతిపరిణామముల కన్నిటికి నాధారభూత మగునట్టియు, శాస్త్రవేత్తలచే శక్తి యనుపేర వ్యవహరింపఁబడినను అనిర్వచనీయ మైనట్టియు నొకపదార్థము గలదని భక్తిపరుఁ డగునార్యుఁడు గుర్తింపఁగలఁడు. ప్రకృతియందుఁ బరస్పరవిభేదము లగుసజాతీయవస్తుసముదాయముల నొక్కొక్కదానిని నియమించుశక్తియు, పతిమహాపదార్థమందును సృష్టియందలి ప్రతిసూక్ష్మకార్యమందును గూడ సంతతమగుశక్తియు నిదియే. ప్రకృతియందలివివిధవస్తువులఁ జూచినపుడు ఆశ్చర్యజనకములు, చిత్తవృత్త్యాకర్షకములు నగు సూర్యాగ్నిజలవాయువర్షముల నధివసించి యుండువివిధము లగుప్రాకృతశక్తులలో నొక్కొకదాని నొక్కొకయుపాసకుఁడు ప్రత్యేకముగ భజించుట గాని, లేక యొకభక్తుఁడే యొక్కొకశక్తి నొక్కొకకాలమందు భజించుట గాని తటస్థించును. అట్టిసమయమందు వానిలో నొక్కొకటియెుఁ దక్కినవాని నన్నిటిని దలదన్ని యారాధకునిమనమును వశముఁజేసికొని వానిభక్తిని జూఱఁగొనునంతటిబలిష్ఠ మగుమహాశక్తిగాఁగన్పట్టును. అప్పు డాశ యెదుట మిగిలినవన్నియు క్షుద్రతఁ జెందును. ఈప్రకారము ప్రతివైదికఋషియుఁ దనదేవతయే మిగిలిన యన్నిదేవతలకంటె నుత్తమ మైనదని పొగడుచుండెను. ఇట్లొక్కొక

కాలమున నొక్కొక దేవత నిరతిశయప్రభావము గలదై కాలక్రమమున నన్ని దేవతలు నట్లే సృష్టికి మహోత్కృష్టమూలకారణము లను మహోన్నతపదవిని బొందిన వయ్యెను. వైదికదేవతాగణమందు నిర్ణీతాధికారతారతమ్యవ్యవ గాని, నియతపౌర్వాపర్యవిభాగము గాని లేనట్లే స్పష్ట మగుచున్నది. ప్రపంచకమున కంతకు నీశ్వరుఁ డొక్కఁడో యనేకమందిదేవతలు గలరో నిర్ణయించుటకుఁ బ్రయత్నమైన జరిగియుండదు. బహుదేవత ఉండిరని యొకప్పుడును, ఏకేశ్వరుఁడే బహుధాప్రదర్శింపఁబడె నని మఱియొకప్పుడును జెప్పఁబడెను.



# ఆధునిక శాస్త్రము—శక్త్యారాధనము:

## ఒక సాదృశ్యము.

ఆధునికశాస్త్రము చెప్పునదియు నింతియే. ఇప్పటి ప్రకృతి శాస్త్రజ్ఞులలో "హాల్సే[1]" "టిండాలు[2]" లవంటివారు సృష్టివైచిత్ర్యములయందు దుర్జ్ఞేయ మగునీశక్తికన్న వేఱేదియుఁ గనుఁగొనలేదు. ఇది యగోచర మగునొకమహాశక్తి. గోచరము లగువివిధశక్తులు ప్రాథమిక మగునీయాదిశక్తికి రూపాంతరములే. ఈశాస్త్రజ్ఞులవలెనే వైదికఋషులును నస్థిరము లగుసృష్టిపరిణామముల కధిష్ఠానము లగు రశక్తులను మాత్రమే గ్రహించి వీనిలో నేయేశక్తి సృష్టియొక్క యేయేసజాతీయసముదాయము నధివసించియుండునో దానిననుసరించి వానిని వేఱువేఱునామములతో వేఱువేఱుతరగతులుగ విభజించిరి. కాని ప్రాచీనఋషులకును, ఆధునికప్రకృతిశాస్త్రజ్ఞులకును భేదము లేకపోలేదు. వారు భక్తులు, కవులు; వీరు, అనిర్వాచ్యవాదులు, తత్త్వాన్వేషకులు. ఋషులు భక్తిపరవశులై తమభావనావిశేషముచేఁ బ్రకృతియొక్క మర్మములను విప్పి చెప్పఁగల మహాకవీంద్రులు. పరిణామవాదు లన్ననో భక్తిరసభావనావిశేషములతో నణుమాత్ర ప్రసక్తియు లేనిశుష్కతత్త్వాన్వేషకులుమాత్రమే యైయున్నారు. పసిబిడ్డలువోలె నమాయికు లగుఋషు లవిదితమగు

నీభగవదన్వేషణమందు "హక్స్లి" "టిండాలు" ల నతిక్రమించిరి. ఆధునికులవలెఁ బ్రకృతియందలిజడశక్తినిమాత్రము చూచుటచేఁ దృప్తిపడక జీవశక్తియగుమూలపురుషునియూసానమునకై సాగిపోయి తుదకు గమ్యస్థానమును జేరియే తీరిరి. వా రగ్నిశక్తి నారాధించిరి. అగ్నియాకృతిని గాదు; దహనశక్తిని. కాని, దానినే యొకప్రత్యక్ష వ్యక్తిగా భావించి గౌరవించిరి. వారు జలమునకు నతిసల్పిరి. వారి కదిప్రార్థనల విని యాదరించుప్రత్యక్షదైవతము. ఉషఃకాలమును వా రొకదివ్యసుందరినిగా సంబోధించిరి. అగ్నిజలప్రభాతము లనువ్యక్తుల నిట్లారాధించుట యెంతయు విపరీత మనియు, నీచమనియు, జుగుప్సాకర మగుబహుదేవతారాధన మనియుఁ గొందఱందురు. కాని యది సత్యముగాదు. అవి దురవగాహములనుమాట వాస్తవమే. హేతువాదికవి దుర్జ్ఞేయము లగుటయు గర్హ్యములగుటయుఁ గూడ నిజమే. కాని యాధ్యాత్మికవ్యక్తి కవి సర్వాతిరిక్తభక్తియోగమర్మములు. శిలావృక్షములకుఁ జైతన్య మారోపించుటయు, మృణ్మయవిగ్రహములను ప్రత్యక్షదేవతలుగా భావించుటయుఁ, గేవలప్రతిమారాధనము. ఎక్కడఁ జూచినను జడపదార్థమును, జడశక్తియుఁ దప్ప వేఱేదియు లేదనుట కేవల మనిర్వచనీయవాదము నాస్తికత్వము. కాని సృష్టివిశేషములందుఁ జేతనమూలకారణ మగునొకవ్యక్తిని గనుఁగొనుట యాస్తికతత్త్వమందుత్తమ మగుహైతుకాంతర్జ్ఞానము. ఇదియే శాస్త్రీయయోగదృష్టికి బీజము. ఈదర్శనము ఆనుమానిక మగుతార్కికవాదప్రతివాదములచేఁ బ్రయత్నసిద్ధము గాదు.

చేతనకారణమే నిమిత్తకారణ మని యంతర్జ్ఞానము వ్యక్తీకరించు చున్నది. శక్తివ్యక్తులు రెండును అఖండజ్ఞానకి యాఫలముగా గ్రహింపఁబడుచున్నవి.

—

# వ్యక్తినిగుర్తించుట.

వైదికఋషికి వ్యక్తి యగుజీవశక్తి స్ఫుటితస్ఫురణముగాఁ బ్రాప్తించెను గాని తర్కసాహాయ్యముచేఁ గాదు. ఆతఁడు జడశక్తినిబట్టి జీవశక్తి ననుమానముచే సాధింపలేదు. అతనియాధాత్మికజ్ఞాన మానుమానికము గాదు. ప్రభంజనదేవుఁడును, అగ్నిదేవుఁడును, నాతనిదృష్టికి హైతుకశక్తులుమాత్రమే కాక సచేతనములు ప్రేమపూర్ణములును అగువ్యక్తులుగూడ నై యున్నవి. మేఘగర్జనము, విద్యుదుద్గమనము, వర్షప్రపాతము ఇవి యాతని కదుతావహములు. వీనిని జూచినపు డాతఁడు నమస్కరించి ప్రార్థించెను. ఆతఁడు సంభాషించెను గాని యెవనితో సంభాషించునదియు నాతనికే యెఱుక లేదు. ఆతఁడు ఏపరమపురుషుని దనపితయనియు, మిత్రుఁడనియు భావించెనో యాతఁడు మాత్ర మతని రక్షించి మోక్ష మిచ్చుటకు సదా సంసిద్ధుఁడై యుండెను. మానవుఁ డగ్నిజలముల నెట్లు ప్రేమింపఁ గలఁడనియు, సూర్యాకాశముల విశ్వసించి యెట్లు పూజింపఁ గలఁడనియు బ వహించునదులను జూచి నిజమాతలుగ నెట్లు సంబోధింపఁ గలఁడనియు శంకింప నేల? మనయార్యభక్తుఁడటుల చేయనే చేసెను. ఆతనిలోచనము లశిక్షితము లయ్యు

నభ్యాసవశముచే సృష్టియందలి వైచిత్ర్యములకును సౌందర్యములకును అధిష్ఠానభూతుఁ డగుపరమపురుషుని దర్శించి తత్క్షణమే విశ్వసించి గుఱియుంచి ప్రేమించి పూజించెను. అంతటను ఆప్రభువే, యామిత్రుఁడే యాతనికి సాక్షాత్కరించెను. ఏవంకఁ జూచినను బవిత్ర మగునాదివ్య పురుషుఁడే ప్రత్యక్ష మయ్యెను. అగ్నియందును, జలమందును, పైని, క్రిందను గలసమస్తపదార్థములందును సర్వాంతర్యామియు సర్వశక్తి యుతుఁడు నగునాపరమేశ్వరు నాతఁడు దర్శించెను. ప్రకృతియొక్క సర్వసజాతీయసముదాయములందును అపారశక్తిజ్ఞానకారుణ్యసంపన్నుఁ డగునాదివ్యమూర్తి నాతఁ డవలోకించెను. అది సర్వవ్యాపిని యగు మహాశక్తి; సర్వసాక్షి; నాతనుఁ డగుజగత్; ప్రేమనిధి యగు జగజ్జనని. పవిత్ర స్వరూపుఁ డగుమోక్షప్రదాత. ఏచట సామాన్య మానవులచేతన మగుజడశక్తిమాత్రము నుఁగొనిరో యచటనే ఋషి విశ్వమును దనతేజోవిశేషముచే నవసించి శాసనములచేఁ బాలించుచు జీవసహితముగఁ జేయుచున్నదివ్య పురుషుని వీక్షించెను. వారిదృష్టి పైతెరవఱకుమాత్రమే ప్రసరింపఁ గలిగెను. తెరవెనుక నేమున్నదియు వారు కనుఁగొనలేకపోయిరి. కాని యాతనిదృష్టి తెరను భేదించుకొని పోయి తదంతర్గతుం డగునాపరమమిత్రుని జూచెను. ఆతని కంతర్దృష్టి దనాశక్తి కలదు. జడప్రకృతియే విశ్వేశ్వరునకాలయము. శక్తియే యాతని మనకన్నులనుండి మఱుగుపఱుచునట్టి యావరణము. ప్రాకృతాలయముయొక్క యీశక్తికుడ్యము సాధారణమానవునిస్థూలదృష్టికి దుర్భేద్యమైనను యోగియొక్క సూక్ష్మ దృష్టికిమాత్రము సుభేద్యమగును. కాన ఋషీశ్వరునకు జడపదా

షులయొక్క భిన్నరూపములందు దివ్య మగునొకవ్యక్తి గోచర మయెను. అట్టిభగవత్సందర్శనము యోగియొక్క దివ్యదృష్టికి మాత్రమే సుసాధ్యము. అటు గాదేని యందఱు దీనిని బొంది యానందింపవలసినదే. సూర్యచంద్రాదులును, అగ్నిజలములును మన మనుదినమును జూచుసామాన్యవస్తువులే. అయినను, సహజ మగుగౌరవాతిరేకము గలిగి యంతర్జ్ఞానముచే నీభౌతికపదార్థములం దొకదివ్య మగువ్యక్తిని దర్శింపఁగలవారెచ్చటనో గాని కానరారు. ప్రకృతి మనయెదుట, పైని, అన్నివైపులను మనల నావరించియే యున్నది. రాత్రియును, బగలును సదా మనము దానిని జూచుచునే యున్నారము. కాని, ప్రకృతియం దంతర్హితమైయుండునాపరమ వ్యక్తిని, ఆప్రకృతిని దమదివ్యదృష్టిచే భేదించుకొనిపోయి, కనుఁగొను నంతటిధన్యు లెందఱు? భౌతికపదార్థములస్వభావస్వరూపములు గని పెట్టుటకై వానిని విభజించి పరిశోధించుటయందుఁదమయావచ్ఛక్తిని వినియోగపఱుచునాధునికశాస్త్రజ్ఞులు గూడ జడపదార్థజడశక్తుల కంటె వేఱేమియుఁ గనుఁగొనలేక పోయిరి. తిమిరావృతంబులగు వస్తువులభంగి సామాన్యమానవుల కస్ఫుటముగ శక్తిమాత్రమె చ్చటఁ గన్పట్టెనో యచ్చటనే యాధునికతత్త్వశాస్త్రముతో నొండె ప్రకృతిశాస్త్రముతో నొండె యించుకేనియుఁ బరిచితిలేనియశిక్షితుఁ డగునార్యునకు విస్పష్టముగ నొకవ్యక్తి గోచర మయ్యెను. కాన, సిద్ధుఁడనినను, యోగియనినను నాతఁడే. ఈనామము లాతనికే తగును. యోగమున కింతకంటె నిర్దుష్టస్వరూప ముండుఁగాక! ఈతనిది మాత మనిశ్చయముగ యోగదృష్టియే. ఇది కవితా

విషయము గాని తత్త్వవిషయము గాదు; దురవగాహము గాని శాస్త్రగోచరము గాదు; భక్తివిశ్వాససాధ్యము గాని హేతువాద సాధ్యము గాదు.



# యోగముయొక్క సహజస్వరూపము.



ఐన నిది యెంతయు సత్యమును, స్వాభావికమును నైయున్నది. దీనిని విభజించి పరిశోధించిన యెడల నిది మనశ్శాస్త్రపరిశోధనకు నిలువఁగల దృఢమగుమనఃప్రవృత్తి యని తెలియఁగలదు. ఇది యనవతచిత్తులవిపరీతమనోవృత్తి యని గాని, భక్త్యుద్రేకమనస్కుల మనోభ్రాంతి యని గాని చెప్ప వలనుపడదు. కేవల మిది స్వచిత్తవృత్తియే యైయున్నది. మానస మొకవిధ మగునవస్థఁ జెందినపుడీ శుభ తి చేకుఱును. మహాత్ములయనుభవ మిందులకుఁ బ్రబలసాక్ష్యము. అన్నిదేశములందును, అన్నికాలములందును, భక్తుల కావేశము కలిగినప్పుడును వారు ధ్యానమగ్నులై యున్నప్పుడును ఈవిశ్వమందే వారికి భగవంతుఁడు ప్రత్యక్ష మయ్యెను. మానస మిట్టి తిఁ జెందియున్నపుడు ప్రకృతియం దంతటను వ్యక్తమగుచున్నయీపరమాత్మ యెదుట వారు భయాయత్తచిత్తులగుటయేకాక యనిర్వచనీయ మగు నొకచిత్రమగుభావనచేఁ బరవశులుగూడ నగుదురు. ఎప్పు డిది సంభవించునో, ఎట్లిది సంభవించునో వారికే తెలియదు. ఆధ్యాత్మికజీవనమం దిది యొకదురవగాహమగువిషయముగఁ గాన్పించినను యథార్థవిషయమే యైయున్నది. సాధారణమానవులకుఁ గొలఁదిగ లభించునదే మహాపురుషులయెడఁ గాంతిపూరమువలె వెల్లిగొని ప్రస

రించును. మూలపదార్థ మొక్కటియయినను భానమందుఁ గలతారతమ్య మత్యద్భుతము. ఉత్కృష్టము లగు రెండుదృష్టాంతములచే నిది స్పష్టము కాఁగలదు.



# ‘ మోసెసు. ’ [3]

“ మోజె ” సాదేశమును బొందుటకై పర్వతాగ్రమునకుఁ బిలువఁబడినపుడు ఆతఁ డక్కడ మండుచున్నపొదయందు “ జహోవా ”[4]ను దర్శించి నమస్కరించె నని చరిత్రవలన మనకుఁ దెలియుచున్నది. నిజముగ నాతఁడు పొదకు నమస్కరింపలేదు. పొదలో నున్నయగ్నికిని నమస్కరింపలేదు. “మోసెసు” విగహారాధనము నెంతమాత్రము నామోదింపఁడు. కాని, మండుచున్న యాచిన్ని పొదయందు సర్వశక్తుఁడు, విశ్వేశ్వరుఁడు నగు “జహోవా” ను దర్శించెను. ఇది విగహారాధనము గాదు; విశ్వారాధనము గాదు; చిత్తోన్మాదము గాదు; మతిభ్రమణము గాదు; హేతువాదముచే సాధిత మగునొకసత్యమును గాదు; ఇది కేవలయోగదర్శనము. నిజమగుయోగీశ్వరునివలెనే యాతఁ డామండుచున్నపొదవంకఁ జూచెను. తత్క్షణమే యాతనిహృదయమునకును, నేత్రములకును నొక దివ్యకాంతి స్ఫురించెను. అపుడు సాధారణమానవుల కగపడునా మండుచున్నపొదయందే యాతనికి “జహోవా”యొక్కదివ్యరూపము ప్రత్యక్షమయ్యెను. అది యొకభౌతికస్వరూపమా? కాదు. చూచుటకును, తాఁకుటకును వీలగునొకయాకారమా? అదియును గాదు. “జహోవా” యాత్మస్వరూపుఁడు. “మోసెసు” మండుచున్నపొదయం దాత్మస్వరూపుఁ డగునాపరమేశ్వరుఁడు ప్రజ్వలించుటచూచెను.

ఆత్మ పరమాత్మను గనుఁగొనుటయే యోగదర్శనము. ఈకాలమం దట్టిదివ్యదృష్టిని బొందియేని, సాధించియేని ప్రకృతియందీశ్వరుని దర్శించువా రరుదగుట యెంతశోచనీయము!





ఈదివ్యదృష్టికి మఱియొకప్రబలనిదర్శనము క్రొత్తనిబంధన మందుఁ గాన్పించుచున్నది. "జార్డను"[6] నదీతోయములందు "జీసను" పరిశుద్ధస్నాన మాచరించి బయటకు వచ్చినపుడు ఆకాశమం దొకవింత యగునాకార మాతనికి గోచర మయ్యెను–ఆకాశము భిన్నమగుటయు, పావుర మాతనిశిరముపైఁ బరిభ్రమణము సల్పుటయు, నందు పరిశుద్ధాత్మనే యాతఁడు గనుఁగొనుటయు. ఏమి యాతనిభాగ్యము! పరిశుద్ధస్నాన మైనవెంటనే యీశ్వరపుత్తున కెట్టిశుభదర్శనము సిద్ధించెను! ఇదియే సాధారణమానవునకు లభించెనేని దానినున్మాద మనియు, వంచన మనియు మన మందుము. కాని, "జీసను" ఉన్మత్తుఁడును, వంచకుఁడును గాఁడు. ఈశ్వరపుత్త్రుఁడు మహాత్ములలో మహాత్ముఁడు; యోగులలో యోగి. ఆతఁడు మిథ్యారూపములఁ జూచువాఁడు గాఁడు. వియద్వివరణమును భగవదవతరణమును దన దివ్య మగుయోగదృష్టిచే నాతఁడు చూచెను. ఎచ్చటనో కాదు. ఈభౌతికాకాశమందును, అందుఁ జరించుసామాన్యపక్షిమాత్రమందే. తత్త్వోపదేశమును బొందనిసాధారణమానవునిదృష్టి కాకాశము కేవల మాకాశమే. అది శూన్యప్రదేశము. పావురమును ఒకపక్షిమాత్రమే. అంతకంటె విశేషమేమియు లేదు. కాని పరిశుద్ధస్నాన మాచరించిన క్రీస్తుయొక్క విమలనేత్రము కేవలపదార్థమునే చూడక దానిని భేదించుకొని పోయి అధిష్ఠానమును జూచెను. అంబరము తనపై తెర

నూఢ్చెను. అపు డొకదివ్యతేజము ప్రకాశించెను. పావుర మాత్మ రూపియై స్వచ్ఛతఁ జెందెను. క్రీస్తుదానియందును, దాని భేదించు కొనిపోయియుఁ బరిశుద్ధాత్మను దర్శించెను. ఆధ్యాత్మికజీవుల కన్నియు నాత్మమయములే. దివ్యనేత్రముల కన్నియు దైవమునే చూపును. ఒక్కనిమిషములో సామాన్యఖేచరమందువిశ్వేశ్వరునిగనుఁగొనుట. అదియు ద్యోతకమగుజీవశక్తినిమాత్రమే కాక యందుఁ బ్రజ్వలించు ప్రత్యక్షదైవమునే చూచుట. ఇది దివ్యదృష్టియొక్కయద్భుతకృత్యము. ఇయది యీశ్వరపుత్త్రునకుమాత్రమే సాధ్య మయ్యెను. మన సామాన్యభక్తిలోచనముచే నసంపూర్ణముగ 'దేనినిసాధింపఁగలమో దానినే యాతఁడు పూర్ణముగ సాధించిచూపెను. పరిశుద్ధస్నానము చేసితత్త్వోపదేశమును బొందుప తిభక్తుఁడును బ్రకృతియం దీశ్వరుని దర్శింపఁగలిగి యుండవలయు నని మాటలకంటె వేయిరెట్లు హృదయ స్పర్శకమును, ఆకర్షకమును అగు తనప్రత్యక్షదృష్టాంతముచేతనే వ్యక్తపఱిచెను. ఏమి మనభాగ్యము! పరిశుద్ధస్నానమను నీసంకేత కృత్యరూపమున నాతఁ డెట్టియమూల్యజ్ఞానధనమును మన కిచ్చి పోయెను! అప్పుడు జరిగినదంతయు నేఁడు మనకన్నులకుఁ గట్టిన ట్లగపడి మనవిషయాసక్తతకును, అల్పభక్తికిని మనలఁ జీవాట్లు పెట్టుచున్నది. దీనినే హిందువులు చదివి ,,జీసను! నీయాత్మనూతనత్వముఁ జెంది నూతననేత్రములతోఁ బ్రకృతియం దీశ్వరుని జూడఁ గలుగునటులు నీవు పరిశుద్ధస్నానము చేసి నిష్కలుషుఁడవుగమ్ము నమ్ముము; నేనాపరిశుద్ధాత్మను బ్రత్యక్షముగఁ జూచితిని. అట్లే వాస్తవముగఁ బరిశుద్ధస్నానమును జే నూతనజీవమును బొందిన ప్రతిమానవుఁడును జూడఁగలఁడు. శుద్ధస్నాన మనుసంస్కారము

జరిగినక్షణమందే యోగమం దీశ్వరునితో నేకీభావమును జెందితిని. సర్వాంతర్యామియు, భక్త్యుత్పాదకుఁడునుఅగునాతనిసాక్షాత్కారమందు మునిఁగితిని. ఆత్మభావాపన్నుఁ డగుప తిమనుజుఁడును నంతియే' యని నాస్తికమును, అపరిశుద్ధమును అగులోకమునకుఁ (జీసను) దెల్పె" నని (హిందువులు) వక్కాణించుచున్నారు. క్రీస్తుయొక్క పరిశుద్ధస్నానము మనుజులందఱకు నొకగొప్పదృష్టాంత మనియు నెల్లరకు సాధ్యమగునొకయాదర్శ మనియు ''పొండి, యిట్లే మీరుమ జేయుఁడి'' యని పురికొల్పునట్టియొకయాదేశ మనియు నొప్పికొనక తప్పదు.



# యోగ మభ్యసనీయము గాని
# నిరసనీయము గాదు.

---

వైదిక కాలమందు హిందూదేశమం దెయ్యది ప్రాకృతప్రారంభ
దశయం దుండెనో, ఎయ్యది మహాత్ములప్రత్యక్షానుభవముచే స్వ
చిత్తవృత్తిగ ధృవపఱుపఁబడెనో యట్టిపరోక్షయోగమును మన
మిపుడు "యూదీయ, క్రైస్తవ" మతజ్ఞానమునుబట్టి పరిశీలించి దాని
తత్త్వమును గ్రహింతము. జీర్ణము, భగ్నము, మాయాజనితమును
నగుప్రాచ్యగూఢవిషయ మని యధిక్షేపించి నిరసింపక, యాధునిక
తత్త్వశాస్త్రసాహాయ్యముచే నియత మగుశాస్త్రాధారముపై ర
పఱుతము. -నిక, ప్రామాదిక, జాతీయదోషములనుండి వేఱుపఱిచి
యు, దానిని బరివేష్టించి నిజస్వరూపమును మఱుఁగుపఱిచి విశ్వదేవ
బహుదేవమతములవలెఁ గాన్పించునటులు చేయుమాలిన్యసాంకర్యం
బులనుండి శుభ్రపఱిచియు, సంస్కరించియు, దోషరహితముగఁ జేసి
యు సర్వజాత్యాచరణీయమును సర్వసమ్మతమును నగుపరిశుద్ధాస్తిక
సిద్ధాంతముగఁ జేయుదము. క్లిష్ట మగుదీనియాధ్యాత్మికతత్త్వ
విషయిక మగువితర్కవిమర్శనముల విడిచి మనకందఱకు నావశ్యక
మును, ఉపయుక్తమును అగునట్టిముఖ విషయముగ నెంచి నిత్య
మును మనలోఁ బ్రతివ్యక్తియు యథాశక్తి దాని నభ్యసింతము.
హిందూదేశమునందలి సచ్ఛాయము లగువృక్షవాటికలందుఁ

గాని, హిమావృతము లగుపర్వతశిఖరములందుఁగాని పాశ్చాత్య దేశములందు శిల్పవాణిజ్యరాజనీతివిషయకవ్యాపారమునందు సదా మునిఁగి తేలుచుండువివిధప్రదేశములందుఁగాని నివసించుప తిభక్తుఁడును ఆసియాఖండవాసిగాని, యూరపుఖండవాసిగాని, అమెరికా ఖండవాసిగాని ఎవ్వఁడైనను ఈయోగశాస్త్రకృషి చేసితీరవలెను. దానికిం దగినగొప్పఫల మాతనికిఁ జేకుఱుననుట కణుమాత్రమును సందియము లేదు.

---

# వైదికయోగము లేక పరోక్షయోగము

## దానిస్వభావవిధానములు.

నియత మగుశాస్త్రవిధుల ననుసరించియు, సరియగుతత్త్వపరిశోధనలఁ జేసియు ఏభక్తుఁడైనను అనుభవమునకుఁ దెచ్చికొని గ్రహింప యత్నించినయెడల నాతనికిఁ బరోక్షయోగమన నెద్దియో దానిముఖ్యలక్షణము లెవ్వియో యవి మానవుని సద్గుణసంపన్నుఁడుగ నెట్లు చేయునో పవిత్రతానందంబుల హృదయమం దెట్లు నెలకొల్పునో వ్యక్తమగును. యోగదృష్టిని యథావిధిగ విభజించి పరిశీలించిన యెడల రహస్యమగుదానితత్త్వము వ్యక్త మగుటయు, దానివిషయమునఁ గలవిపరీతగ్రహణము తొలఁగుటయు తట సించును. అంతియె కాక విశ్వాసముకూడ జనింపవచ్చును. మూఢవిశ్వాసరహితుఁడును ఆధునికతత్త్వజ్ఞానసహితుఁడును అగునీనాఁటితత్త్వవిదుఁ డగుయోగి ప్రశాంతచిత్తముతో సృష్టివిశేషములపై ధ్యానము నిలిపినపు డాతని స్థితి యెట్లుండునో విచారింతము. విక్షేపకములును, వికారహేతుకములును అగుపాపంచికచింతలుగాని, మనోవ్యథలుగాని యాతని సమాధి కంతరాయములు గానేరవు. తన్నుఁ జుట్టియుండుచిత్తాకర్షక వస్తువులయం దాతనిమానసము లగ్నమై యుండును. ఇపు డొక సుందరమగుగులాబీపుష్పముపై దృష్టి నిలిపి అంతట క్రమముగ

నొక మహావృక్షమును, కలకలలాడుచేనును, ప్రవహించుసెలయేటిని, ఉన్నతమగుపర్వతమును, గానముచేయుపక్షిని,అగాధమగునీలజలధిని, పైనున్ననీలనభమును, వీనినన్నిటి నవధానముతో నవలోకించునప్పు డాతనిమానసము ప్రకృతిలోనియొకపదా మునుండి మఱియొకపదా ర్థమున కానందముతోఁ బరుగిడును. తుదకుఁ జిత్తము తదాయత్త మగుటచే నాతఁ డానందపరవశుఁడై "ఈసౌందర్యము, ఈనియమ క్రమములు, ఈవృద్ధిపరివర్తనములు,ప్రకృతి కెక్కడివి? ఈవిశ్వమును బాలించి ప్రాణవంతముగఁ జేయునదెయ్యది? లేక యెవ్వఁడు?" అని ప్రశ్నించును. ఆకస్మికముగ నాతఁడు పులకితుఁ డగును. అన్నిటి యందును వ్యాప్త మగునాదిశక్తి యనుచేతనకారణము నాతఁడు సహజజ్ఞానముచే గ్రహించును. శక్తి నిట్లు గుర్తించుట యవ్యవ హితమును, సహజమును నై యున్నది. కాని యాతనికిట విశ్వాసము ను, శాస్త్రమును సమన్వయము నందినటులును, యోగియు శాస్త్ర వేత్తయు నేకీభావము చెందినటులును దోఁచును. ఆదికారణ మగు నేశక్తియందు—బలము, జ్ఞానము, ప్రేమము, సౌందర్యము కార్య మందువలెనే యిమిడియుండునో, యది యిపు డాతనిప్రాథమికదృష్టికి స్పష్టముగ గోచరమగు నీశక్తియే. ఆతఁ డొకసత్యశివసుందర స్వరూపమును దర్శించును. అదియే సర్వాధారకమగుసంకల్పశక్తి; జ్ఞానమూర్తి; ప్రేమనిధి. తనయొక్కయు, విశ్వముయొక్కయు;ఆత్మ యొక్కయు ననాత్మయొక్కయు స్థితిగతుల నాతఁడు దానియందుఁ గాంచును. మఱియు నాతఁ డపారశక్తిజ్ఞానసంపన్నుఁ డగు నామంగళమయుని తనజ్ఞానశక్తులచే గ్రహించినతోడనే హృదయ ము భావములచేఁ బరిప్లుత మగును. కృతజ్ఞత, విశ్వాసము, గౌర

వము, విస్మయము, ప్రేమ, ఆనందము, ఆవేశము—ఇవి పొంగి
పొరలుటచేఁ జూపున కొకవిధమగుమాధుర్య మొసంగు ననుట నిక్క
వము. ఇది యంతయు నొక్కత్రుటిలో జరుగును. విశ్వాసము, బుద్ధి,
యనుభవనయోగ్యత— ఈమూఁడును గూడి పరిశీలకుని కొకలోచన
మయ్యెనో యనున ట్లుండును. అంతపరిశీలకుఁడు శాస్త్రసత్యత్వము
తోడను, దృఢభక్తితోడను, పూర్ణానందముతోడను జూచును.
మానస మంతకంత కేకాగ తఁ జెందినకొలఁదినీవిధమగునీశ్వరపరి
జ్ఞానము మఱింత స్ఫుటమై యానందకర మగును. తుదకుఁ దాదా
త్మ్య మే సిద్ధించును. విశ్వముయొక్క మహాకవాటము లన్నియు నొక్క
మాఱు తటాలునఁ దెరవఁబడును. పర్వతములు, నదులు; వృక్షము
లు, పుష్పములు; సూర్యుఁడు, చందు ఁడు, నక్షత్రములు; వాయువు
వర్షము; అగ్ని, మెఱపు; కీటకము, పక్షి; మృగము, మనుష్యుఁడు;
అన్నియుఁ దమతమయభ్యంతరాలయములఁ దెఱచును. అన్నిటి
యందు నాజీవశక్తి వ్యక్త మగును. ప తివస్తువు, ప తిజీవియు నల్ప
మైనను, అధికమైనను ,,జహోవా" యొక్క యాలయముగఁ గాన్పిం
చును.ఇంతవఱకును మూయఁబడియుండునాలయపుఁదలుపులు ఇంద
జాలమహిమచేవలె నిప్పు డాకస్మికముగఁ దెరవఁబడును. అంతట
లోపలనుండు దేవత పరిశీలకునిభక్తిలోచనమునకుఁ బ్రకాశించును.
నేఁటివఱకు నొకదట్టమగుతెర విశ్వముఖముపై వ్రేలుచు నందలి
యద్భుతరహస్యముల మఱుఁగుపఱిచెను. ఇపు డొకత్రుటిలో నాతెర
పైకి లేచుచు. ఇంతపర్యంత మంతర్హితుం డగునీశ్వరుం డొక్కమా
ఱుగ యోగియొక్క విమలదృష్టికి గోచరమగును. ద ష్టకు, దృష్టము
నకు; ధ్యాతకు, ధ్యేయమునకు; జీవాత్మకుఁ, బరమాత్మకు; పుత్తు న

కుఁ, బితకు నేఁటివఱకుఁ బృథగ్భావము గలదు. ప్రకృతి, శిలానిర్మిత మగునొక మహాకుడ్యమువలె నిరువురకు మధ్య నడ్డముగ నుండెను. మనుజుఁ డీశ్వరు నస్పష్టముగ మాత్ర మెఱిఁగి తనప్రా నానుసయం బుల నతిదూరమున ఘనతిమిరావృతుండై యుండునాయజ్ఞాతుని దివ్యధామమున కంపెను. ఉపాసకుఁ డెంత తాత్త్వికుఁడైనను, ఎంత భక్తుఁ డైనను, బూజాలక్ష్యమున కనేకయోజనముల దూరముననే నిలిచియుండెను. ఆతఁడు పే మవిశ్వాససహితుఁ డయ్యుఁ దనకర్త నెన్నఁడు గాంచనియన్యుఁడే యయ్యెను. ఈశ్వరుఁడు ప్రకృతికధిష్ఠాత యై నిజహస్తనిర్మితవస్తువుల విరాజిల్లు నని యాతఁ డెఱుంగును. కాని యాతఁ డెప్పు డాయనను జేరఁబోయిన నీవస్తువులే యాయనను మఱుఁగుపఱిచెను. అవి తమశోభాసౌందర్యనియమనిర్వహణవైచిత్ర్య ముల వ్యక్తీకరించుచు నిజనిర్మాత నంధతమస్సుచే నావరించెను. ఆతఁ డెన్నఁడు ముఖాముఖి తనదేవుని జూచుటకుఁ గాని, ఆయనతో సంభాషించుటకుఁగాని సమర్థుఁడు గాఁడయ్యె. అజ్ఞాతుఁ డగునీశ్వరుని యజ్ఞాతవసతికిఁ దానొకవార్త నంపవలసివచ్చెనేని తద్వార్తాహరణ కార్యనిర్వహణమునకై ప కృతియే తంతి కావలసివచ్చెను. విశ్వాల యమునఁ దండి కలఁడనునిశ్చితజ్ఞాన మాతనికిఁ గలదు; అంత మాత మున ప యోజన మేమి? కవాటము సదాబంధింపఁబడియే యుండెను. ఇచట మానవుఁ డధఃపతితుఁడై ప్రాఁకులాడుచుండ నచట దేవుఁడు ప కృతిచే నంతర్హితుఁడై యనంతత్వమున లీనుఁ డయ్యెను. ఇరువురును పృథగా వము నొందినయొకవియుక్తద్వంద్వ మయ్యెను. పంచభూతాత్మక మగునీదృశ్యప్రపంచము భౌతికశక్తి వ్యూహసహితముగ నిరువురకు నడుమ నడ్డమువచ్చి సంయోగమున

కంతరాయము కలిగించెను. ఇపుడు తత్త్వపరిశీలకునిలోచనము నూతనజీవము నొంది యోగోన్మీలిత మగుటచే నాతఁడంతరాయము నపనయించి యవరోధము నున్మూలించి నిరాతంకముగఁ దనయీశ్వరునికడకు సాగి పోవును. వ్యవహిత మగుదైవ మిపు డవ్యవహితముగఁ గన్పట్టును. పరోక్షుఁ డగునీశ్వరుఁ డిపుడు ప్రత్యక్షుఁ డగును. వియోగముఁ జెందినవీరిరువు రిట్లు ముఖాముఖి నొకరియెదుట నొకరు నిలుతురు. ఒకరి నొకరు సమీపించినకొలఁది నన్యోన్యాంతఃప్రసారముచే నాత్మీయబంధ మధికమై మిళనము సిద్ధించును. మొదటఁ బరస్పరాకర్షణము, తరువాత క్రమముగ సమాగమము, సమ్మేళనము, సాయుజ్యమును గల్గును నిరంతరసంగమము, యోగమును సు రము గావించుటయే కాక దాని కెక్కుడు యాథార్థ్యమాధుర్యముల నొసంగును. తుదకు యోగబంధ మభేద్య మగును. యోగి యిపు డాప్రియజనకునిహస్తమునందు సదా విన్యస్త మగుతనహస్తముతోడను, ఆతనియఖిలావలోకనదక్షం బగుచక్షువునందు సదా నిక్షిప్త మగు తనచక్షువుతోడను నిరంతర మొకదివ్యకాంతిపూరమున నివసించునోయనున ట్లుండును. ప్రతిపదార్థ మీశ్వరుని జేరుట కొక మార్గమగును. ప్రకృతియంతయునాతనియవ్యవహితసాన్నిధ్యప్రాప్తికై చేయుశీఘ్రయాత్రకు వలయుసౌకర్యములఁ గూర్చును. ఉపాసకుఁడు సూర్యచంద్రులద్వారమున నీశ్వరునందుఁ బ్రవేశించును. ఆయనయు వానినుండియే యాతనిఁ జేరును. ప్రతిబంధకమగు వ్యవధానము పూర్ణముగఁ దొలఁగింపఁబడినందున దివముతో స్వేచ్ఛావిహారము నెలకొల్పఁబడుటయె కాక కేవలదుర్గమము లగుమార్గములనుండి రాకపోకలకు వలయుపూర్ణస్వాతంత్ర్యముగూడ లభించును. యోగి

యొక్కద్యు
వేగముతో
బ్రతిశక్తికి
ర్వాంతర్యా
ముఁ జెందు
తామే య
కొకమనో
గణితశాల,
చేఁ దేజరిల్లు
వలె నూత
యొక్కప్రతి
యమునకు
శాస్త్రవేత్త
నక్షత్రశాల
పెట్టును.
గోళముల
అంతరిక్షశా
తో నారం
విశ్వమును
లనుస్పష్టమ
శాస్త్రంబు
శాస్త్రంబు,
నీవిశ్వమహ

యొక్క దృష్టి కుడియెడమలకుఁ జలించుచు మహాకాశమందుఁ దీవ్ర
వేగముతో నలుదెసలకుఁ బరుగిడుటయేకాక ప్రతిపదార్థమునకును
బ్రతిశక్తికినిఁ బ్రకృతిలోనిప్రతినియమమునకును నధిష్ఠాతయు, స
ర్వాంతర్యామియు నగుతనప్రభువు ననుసంధించి యాతనితో నైక్య
ముఁ జెందును. ఆవిరి, మెఱుపు; వెలుతురు, వేఁడిమి; ఇవి తమంతట
తామే యాతనిఁ బ్రకటించును. ఆకర్షణశక్తి యీశ్వరునిదర్శించుట
కొకమనోహరమార్గమువలెఁ గన్పట్టును. పరిశోధనశాల, నక్షత్ర
గణితశాల, వస్తుదర్శనశాల, అంగచ్ఛేదనశాల, ఇవి యాతనియునికి
చేఁ దేజరిల్లును. సూక్ష్మదర్శినియు, దూరదర్శినియు దివ్యనేత్రముల
వలె నూతనసౌందర్యప్రపంచములఁ జూపును. ప్రకృతిశాస్త్రము
యొక్క ప్రతిశాఖయు నుత్కృష్టుఁ డగునా "జహోవా" యొక్క యాల
యమునకు రాజమార్గ మగును. యోగి యగుశాస్త్రవేత్త జ్యోతి
శ్శాస్త్రవేత్తయై పైని గిరగిరఁ దిరుగుచుండు గ్రహములఁ దనయున్నత
నక్షత్ర శాలనుండి పరిశీలించునపు డనేకనూతనవిషయములఁ గని
పెట్టును. అందుఁ బ్రతివిషయంబును దక్షిణహస్తమం దీయద్భుత
గోళముల ధరించునామహాశిల్పివక్షమునకే యాతని గొనిపోవును.
అంతరిక్షశాస్త్రవిదుండై యాతఁడు వాయుచలనముల జాగరూకత
తో నారయునపుడు ఎవ్వడు వాతావర్తముపై విహారము సల్పుచు
విశ్వమును దనబలముచేఁ గంపింపఁజేయుచుండునో యాతనిశ్వాసము
లనుస్పష్టముగ నావాయుచలనములం దాతఁడు గనుఁగొనును. గణిత
శాస్త్రంబును, ప్రకృతిపదార్థగమనవేగాదివిషయక మగుయంత్ర
శాస్త్రంబును ఆతఁ డెక్కుడుగ నభ్యసించినకొలఁది నత్యద్భుతమగు
నీవిశ్వమహాయంత్రమునకుఁ గర్త యగునాయుత్కృష్టగణితశాస్త్ర

వేత్తను, యంత్రశాస్త్రవేత్తను ఆతఁ డెంతయుస్పష్టముగఁ జూచును. ఆతఁడు వృక్షశాస్త్రజ్ఞుఁడై కాని, శరీరశాస్త్రజ్ఞుఁడై కాని, యసంఖ్యేయము లగువృక్షజంతుజీవాకారములతో వ్యవహరించునపు డాతని మానసము సర్వజంతుజీవద్వారమున ననశ్వరుం డగునీశ్వరునిప్రాథమికజీవశక్తిలోనికే పరుగిడును. ఈవిధమున శాస్త్రముయొక్క ప్రతిశాఖనుండి తనచే సృష్టికర్తగ గుర్తింపఁబడి పూజింపఁబడు నాపరమపురుషుని యవ్యవహితసాన్నిధ్యములోని కాతఁ డెఱుఁగకయే యప్రయత్నముగ మెలమెల్లఁగ జాఱుచుండును. ప్రాకృతికాధ్యాత్మికజ్ఞానవేద్యుండును, సర్వాంతర్యామియు, నిరంతరజాగరూకుండును, నగు నీశ్వరుని కాతఁడు సల్పునిత్యారాధనావిధానమున కాలయమై వెలయుటంజేసి ధన్య మగునీవిశ్వమే పావనములలోఁ బరమపావనము. పఠనచింతనపరీక్షాప్రార్థనంబుల నాతని కెటుచూచిననీశాస్త్రదేవుఁడే సాక్షాత్కరించునటులు తోఁచును. మఱియు నట్టిదేవునితో నాతని కిపుడు కలుగుసంపూర్ణ మగుతాదాత్మ్యముచే నిరువురకు నవియుజ్యమగుయోగసిద్ధి చేకుఱును. అజ్ఞాతుఁడని కాని, దూరవర్తి యనికాని జడుఁడని కానిచెప్పఁబడుమిథ్యాదైవ మిపుడు మాయమై ప్రబలతేజస్వియు, నిత్యసన్నిహితుఁడును, నిరంతరజాగరూకుఁడును అగు శాస్త్రదేవుఁడు విశ్వమెల్ల దీప్తిమంతముగఁ జేయును. నిజమగు శాస్త్రపరాయణుం డెల్లయెడలజ్యోతిశ్శాస్త్రదేవుని, అంతరిక్షశాస్త్రదేవుని. రసాయనశాస్త్రదేవుని, భూగర్భశాస్త్రదేవుని, శరీరశాస్త్రదేవుని, వైద్యశాస్త్రదేవునిదర్శించి యాతనితో గాఢానుసంధానము నొందును. విద్యుదయస్కాంతశక్తులయొక్కయు, వాయుజలములయొక్కయు, కాంతిశబ్దములయొక్కయు, గ్రహణకేతువులయొక్కయు,

వాస్తునౌకావిద్యలయొక్కయు కృషిశిల్పవ్యాపారములయొక్కయు, దేవుని నాతఁడు తనయెదుటనే కాంచును. ఆతఁడు ప్రత్యేకపదార్థములం దీశ్వరుని దర్శించి యర్చించునపుడు వానిలో నుత్కృష్ట మగు వానిని సూర్యదేవుఁ డనియు, సోమదేవుఁ డనియు, వర్ష దేవుఁడనియు అగ్నిదేవుఁ డనియుఁ, బర్వతదేవుఁ డనియు, సముద దేవుఁ డనియు, సస్యదేవుఁ డనియు, ధనదేవుఁ డనియుస్తోత్రము చేయును. జాజ్వల్యమాన మగునాదివ్యపురుషసాన్నిధ్యము సకలపదా ములకును దీప్తి నొసంగి విశ్వమెల్ల నొకపెద్ద "మండుచుండుపొద" గా మార్చి వేయును. ఇట్లీశ్వరసాయుజ్యమును బొందినఋషులు ప్రాచీన మతావలంబకులు గాని, ఆధునికమతావలంబకులు గాని, ప్రాచ్యులు గాని, పాశ్చాత్త్యులు గాని, ఎవ్వరైనను దివ్యతోయముల జ్ఞానస్నాన మొనరించి యమృతాన్నము భుజించియు, సమస్తవస్తువులందును దేవుని దర్శించియు, ఆకర్ణించియు, స్పృశించియు, అఖిల విద్యలందును దివ్యజ్ఞానమునే గుర్తించియు, దివ్యమిత్రు ననుచరించియు, నెల్లప్పుడా పరమపితయొక్కయమృతప్రతిమాన మగుశాశ్వత సన్నిధానతత్త్వమం దానందమున నోలలాడుదురు. వారు సర్వమును దేవునియందును, దేవుని సర్వమందును జూతురు. ఇట్టిగాఢయోగమున వియోగ మసంభవము. యోగి దేవునితోఁ బూర్ణముగ నైక్యముఁ జెందుటంజేసి యాతఁ డాయనను తననుండి కాని, విశ్వమునుండి కాని వేఱుగ భావింపఁజాలఁడు. వియోగము మతవిషయకవిపన్మాత్రము గాని, భక్తివిషయకబాధామాత్రము కాని యగుటయేకాక మనశ్శాస్త్రవిరుద్ధముకూడ నైయున్నది. తుద కీశ్వరజ్ఞానతత్పరత్వము సిద్ధించుటంజేసి మానవుఁ డనవరత మాపరమపితసమక్షమున

వసియించును. అట్టి యాతనివసతికి నించుకేని భంగ మెన్నఁడును గలుగనేరదు. ఎట్టిసంగతియందు విసంగతియసంభవమో యదియే గాఢతమ మగుయోగానుసంధానము. ఈశ్వరానుగ్రహముచే నాధ్యాత్మికకృషియం దిట్టియున్నత తి నొంది దేదీప్యమాన మగుపరమ జ్యోతియు, పరశక్తియు, జ్ఞానమూర్తియు, పే మస్వరూపియు నగు నాపరముపురుషుని నెల్లయెడలఁ గాంచువారిపరమానందమయ మగు నవస్థ యిదమిద్ధ మని నిరూపింప నెవరితరము? పరోక్షయోగమన నిట్టిద. తల్లభ్యము లగునీశ్వరదర్శనానందము లిట్టివ.

---

# వేదాంతికయోగము లేక అపరోక్షయోగము: దానిస్వభావవిధానములు.

వైదికయుగానంతరము వేదాంతికయుగము. ఈయుగమందు హిందువునిమానసము బాహ్యప్రకృతినుండి యాంతరప్రపంచమును బ్రవేశించుటఁ గాంతుము. ఇపు డార్యునియాధ్యాత్మికతత్త్వమునకు ముఖ్యసూత్రము అంతఃపరిశీలనము గాని అవలోకనము గాదు; అపరోక్షానుభూతి గాని పరోక్షానుభూతి గాదు. శిశువు క్రమముగఁ బెఱిఁగి యౌవనదశఁ జెంది యాలోచనమునకుఁ దావొసంగును. ఋషి మునుపటివలెఁ బ్రచోదనాధీనుఁడును, కవితాశీలుఁడును గాఁడు; శాంతచిత్తుఁడును, తాత్త్వికుఁడును మాత్రమే. ఇంతదనుక నప్రయత్నసిద్ధ మగునీశ్వరపరిజ్ఞాన మిపుడు మననపూర్వకమైనదగును. బాహ్యప్రపంచముతో నాతని కిఁకఁ బనిలేదు. ఇంద్రియావగతము లగుపరికరముల నన్నిటి నాతఁడు సంగ్రహించియున్నాఁడు. ఇపుడాతఁడు చేయవలసినది తత్త్వీకరణమును విమర్శనమును. ఆతఁ డిప్పుడు తనయాస్తిక్యమునకు హేతునిరూపణంబుఁ గావింపవలయును. తనమతము నాధ్యాత్మికతత్త్వముగా నాతఁ డిపుడు మార్చుకొనవలయును. తదనుకూలముగనే ద్వితీయయుగమందుఁ బరమేశ్వరునిస్వభావమునుగూర్చియు, గుణములనుగూర్చియు విపులములైనవిమర్శకములగుగ్రంథములను గనుచున్నారము. అవియే యుపనిషత్తు లనంబ

డును. వేదముల కివి యంతము లగుటచే వీనిని వేదాంతములందురు అనఁగా నివి వేదతత్త్వార్థతాత్పర్యప కాశిక లనందగు. ఇవి వైదిక మతము నకుఁ ద త్వకరణము. మునుపటివలె వైదికఋషి ప కృతి పదా ములఁ బూజించుటయు, స్తుతించుటయు, భక్తితో వానిగుణ గానము సేయుటయు మనము గానము. ఇపుడు వేదాంతికఋషి, ధ్యానమగ్నుఁడై, నిమీలితనేతు ఁడై, పరమాత్మతో గాఢతమ మగుయోగాభ్యాసము సేయుటఁ గాంతుము. వైదికఋషి కేవల పరోక్షదర్శి. బాహ్యప్రకృతియే దేవునిచేరుట కాతనికిమార్గము. వేదాం , కేవల మపరోక్షద . అదృష్ట మగుపరమాత్మను జేరుట కాంతరప కృతిలోనియగాధములనుండియే యీాతనికి మార్గము. కాన నీతనిదే యుత్కృష్టయోగము: అంతియ కాదు, బాహ్యమగుమధ్య వర్తిని గాని, ఇతరమగు నేసాహాయ్యమును గాని యాశింపక పదా మునుండి యీాతఁడు పూర్ణముగ మఱలును గాన దీనికి మాత్రమే యోగమనుపేరు సా క మగును. ఆతఁ డాత్మతో నాత్మను; జీవాత్మ తోఁ బరమాత్మను ననుసంధించును. తనవైదికపూర్వపురుషునికివలె నే యీాతనికిని ప్రమాదములు గలవు. వైదికారాధకుఁడు కొ సమయములందుఁ బోయిపోయి ప కృత్యారాధనమునే సమీాపించు నటులు వేదాంతికతాత్త్వికుఁడును విపరీతమగునపరోక్షతచే విశా రాధనావర్తములోనికే కొనిపోఁబడును. అయినను, వైదిక మగు పరోక్షయోగసార మెటులు వ్యక్తపఱుపఁబడి న్యాయమైనదని సిద్ధాంతీకరింపఁబడెనో యట్లే వేదాంతిక మగునపరోక్షయోగతత్త్వ సారము న్యాయమైన దని నిరూపింపవచ్చును. కాన, నీనిగూఢ

యోగరహస్యమును విప్పి చూపి యపరోక్షయోగియొక్క మనఃప్రవృత్తిని విశదీకరింపఁ బ్రయత్నింతము.

ఎవఁ డిట్టి శ్రేష్ఠమగు యోగానుసంధానమునఁ బరమాత్మతో నైక్యముఁ జెందఁగోరునో యాతఁ డీలోకమునఁ గలసంభ్రమసంక్షోభములనుండియు, భయప్రలోభనములనుండియు నివృత్తుఁడై యేకాంతతానిశ్శబ్దతల నాశ్రయించును. పూర్ణ మగు నేకాగ్రతచే నిశ్చలావధానము నిత్యంబగు నాపరమాత్మయందు నిలుపుటకై బాహ్యేంద్రియగోచరము లగుసమస్తవస్తువులనుండియు నైహికములగు సమస్తచింతలనుండియు, మనోవ్యథలనుండియుఁ దనహృదయమును మరల్ప నాతఁడు ప్రయత్నించును. అతిజాగరూకతతో నాతఁ డవిచ్ఛిన్నమగుపోరాటము సల్పి, యింద్రియముల జయించి, యాత్మాధికారియై తనయెల్లతలంపులను, వాంఛలను గఠినముగ శాసించును. ఇచ్ఛ యొకమహాశత్రు వనియు, అహంకారము తన్నీశ్వరునుండి వేఱుసేయు నొకగొప్పయవరోధ మనియు నాతఁడు కనుఁగొనును. ప్రతి పాపేచ్ఛయు నవధానమున కాటంక మగును. అహంకార మెల్లవేళల గలఁతకుఁ గారణ మగును. స్వేచ్ఛయే యోగమునకుఁ బ్రబలశత్రువు. దానిని నాశన మొనరించుట కాతఁడు యత్నించును. పరోక్షయోగమందుఁ జదా మె గొప్పయవరోధము. అది తొలఁగింపఁబడినంతనె యాత్మ పరమాత్మతో నైక్యముఁ జెందును. అపరోక్షయోగమందహంకారమే ప్రతిబంధకము. అది తొలఁగింపఁబడినంతనే జీవేశ్వరులేకీభావము నొందుదురు. ఆత్మసంయమము సాధారణముగ మనమనుకొను వైరాగ్యము గాని, సన్న్యాసము గాని, కాదు. అది కేవల పయసౌఖ్యవైముఖ్యంబును గాదు; ఐహికభోగపరిత్యాగంబును

గాదు; దుర్భరదారిద్ర్యానుభవంబును గాదు; కేవలకాషాయాంబర ధారణంబును గాదు; భస్మావలేపనమాత్రంబును గాదు. అది వాని నన్నిటిని మించినదై యున్నది. తద్విహితోపహార మీయన్నిటికంటె మిక్కిలి గాఢము; గంభీరము. అది స్వా , స్వా పరత్వ, స్వప్రశంసన, స్వేచ్ఛాప వర్తనములవినాశమాత్రము గాదు; "స్వ" సమర్పణంబె. అహంభావము స్వతోగర్హ్య మనియుఁ బాపమనియు భావించి యాతఁ డేవగించును. పాపవృక్షముయొక్క శాఖలనుమాత్రము నఱికివేయుటచేఁ దృప్తి చెందక తన్మూలచ్ఛేదనమే కావించును. భక్తి ధ్యానముల కంతరాయము లగుచుఁ బరమాత్మనుండి యాతని విముఖుని జేయుకామక్రోధలోభమోహమదమాత్సర్యముల నాతఁడు తఱిమివేయును. ఈకార్యమును సాధించుట కాతఁ డవలంబించు విధానక మముమాత్ర మతివిచిత్రము, సంపూర్ణమును. కామక్రోధాదులలోఁ బ్రతిగుణముతోడను బోరియుద్ధము చేసి దానినిమాత్రము నాశనమొనరించుట కాక పరమాత్మయందు లీనమై సమస్తపాపనిదానంబగునహంభావోన్మూలనంబె యాతనికర్తవ్యము. ఈశత్రుషట్కమున నొక్కొకరి నొక్కొకమా ఱెదుర్కొని ప్రత్యేకముగ జయించుటకు మా ఱాతఁడు ధైర్యసాహసంబులతో శత్రుదుర్గగర్భభాగంబును బ్రవేశించి దానిఁబడఁద్రోసి రూపుమాప యత్నించును. ఆతనినీతిశాస్త్రము నిషేధనాశనముల విధింపదు; అంగీకరణనిర్మాణములనే శాసించును. ఆతనినైతికాధ్యాత్మికపూర్ణత కాదర్శము పాపముయొక్కయు, విషయాసక్తతయొక్కయు, ఐహికభోగపరాయణత్వముయొక్కయు, అహంకారముయొక్కయు అభావము మాత్రమె కాదు. అది కేవలదేవత్వముం జెందుటయె. ఆతఁడు కాంక్షించునది సర్వ

సంగపరిత్యాగము గాదు; స్వర్గప్రవేశము. అహంకారమమకార మాంకారములు దేవత్వమందు లీనమగుటకంటె నాతఁడు కోరుముక్తి మఱి లేదు. నిరంతరధ్యానపరాయణుండై యీశ్వరసాయుజ్యమును బొందుటకై సతత మాతఁడు యత్నించుచుండును. చంద్రునియందుఁ బ్రతిబింబిత మగుపరకీయకాంతి యుదయించి యుద్గమించుసూర్యుని యెదుట వెలవెలఁబాఱి క్షీణించుగతి సత్త్వారహితం బగునాత్మ క్రమక్రమముగ మాయమగువఱ కాతఁడు పరమాత్మతత్త్వమందె తన నిశ్చలావధానమును నిలుపును. సత్తుదయించినంతనె యసత్తస్తమించును. దేవతాంశములు గానిశక్తు లేవియు నాత్మకు లేవనియు, దానికిఁ గలజ్ఞానప్రేమపావనత్వంబులు దేవతాశక్తులే యనియు నిపుడు తేటతెల్లమగును.

నూతనజీవనము నొసంగునిట్టియోగము నెవరుతృణీకరింపఁ గలరు? ఐహిక జీవనమును బూర్ణముగ వదలివేసినూతనదివ్యజీవనము నెవరు గ్రహింపరు? ముదుసలి కభ్యంజనాదిసంస్కారము లొనరించి సుశీలత మొదలగుమైపూఁతలచే మెఱుఁగిడుటమాత్రముచేఁ దృప్తిఁ జెందక ముసలిరూపమును బూర్ణముగ వదలి దివ్యరూపము నేల ధరింపరాదు? భగవదారాధన మెల్లపుడు దూరమందుండియే చేయ నేల? మన మెచ్చట నున్నను నానావిధంబు లగునిత్యకృత్యములలో వేనియందు సక్తులమై యున్నను భగవానుని ముఖాముఖి దర్శించుచు గాఢమగుయోగానుసంధానమున నాతనియం దేల జీవింపరాదు? అనేకప్రాచీనార్యవేదాంతులవలె యోగాభ్యాసమునకై వనముల లోనికిఁగాని, గిరిగహ్వరములలోనికిఁగాని పోవనక్కఱలేదు. ఆయనంతునిదర్శించుటకై యతులకు విధింపఁబడు నేకాంతతానిశ్శబ్దతల నాశ్ర

యించి సంసారమును, స్నేహితులను, సాంసారిక సాంఘిక విధులను ద్యజింప నక్కఱలేదు. మనలోఁ బ్రతివ్యక్తియుఁ దానున్నస్థానమును విడువక తనకీశ్వరునిచే నియమితం బగుపదవియందె యుండి వివిధంబు లగుజీవితవ్యాపారములందును భవసంక్షోభములందును సంఘమందును సంసారమందును స్వసంకల్ప మీశ్వరసంకల్పముతో సుతిఁగూర్చి యాపరమాత్మతో నవియుజ్య మగునాత్మానుసంధాన మనుభవింతము. వాస్తవ మగునపరోక్షయోగ మహంభావ మంతస్థానమైనదని భావించుటయును గాదు; భావనాకల్పితలావణ్యరాశి యగుదైవమం దాత్మ లీనమైనటులు భ్రమించుటయును గాదు. అది సత్యమందును, బరిశుద్ధతయందును జీవేశ్వరులకుఁ గలుగుపావనానుసంధానము. ఇదియే వాస్తవయోగ మగునెడఁ బ్రాచీనవేదాంతులు మాత్రమే కాక మనముకూడ దాని నభ్యసించి సాధించి తీరవలయును యోగి పూర్ణముగఁ బరవశుఁడై ఆత్మయందుఁ బరమాత్మను, పరమాత్మయం దాత్మను దర్శించునపు డాతనియాత్మకుఁ గలఔన్నత్య పావనత్వములును, శాంతతానందంబులును వర్ణింప నెవరితరము; మనమిపుడు దానిపరమానందమయంబగునవ ను బరిశీలింతము.



# తత్స్వభావము.



సకలము నిశ్చలమైయుండును. నేత్రములు నిమీలితములగును. దృశ్యప్రపంచముతో వ్యాపారమెల్ల ముగియును. విక్షేపకంబు లగుచింత లన్నియు పలాయితము లగును. విచారవ్యాకులతలు పూర్ణముగ విరామము నొందును. ఆత్మకేకాంతతయు, నిశ్శబ్దతయు, ప్రశాంతతయు లభించును. ప్రపంచమందును హృదయమందును సందడి యడఁగును. గాఢ మగునీనిశ్శబ్దత కేదియు భంగకారికానేరదు. లోపలియాత్మకుఁ గలశాంతత నేదియుఁ జలింపఁజేయనేరదు. అంతరాగారమంధతమోమయంబు. వస్తు వేదియు నగపడదు. అహంకారపూరితంబును, ఈశ్వరధిక్కారశీలంబును నగునాత్మదక్క వేఱేదియు నున్నటులు గానంబడదు. అది మాయారూపి యయ్యు దుర్భేద్యమగునవరోధమై యోగి యెటు దిరిగిన నాతని కడ్డము వచ్చును. "ఓపిశాచమా! ప్రాణములఁ దీయునోమాయారూపమా! సర్వపాపములకును మూలమా! అశుభప్రద మగుననాహూతాగంతుకమా! పొమ్ము; వెడలిపొమ్ము. నీవు నాకక్కఱలేదు. నీవు మాయారూపివి; నాకు గర్భశత్రువవు; నీవుండుచోటికిఁ బరమాత్మ యడుగిడదు. కావునఁబొమ్ము. ప్రాణశత్రువా! నాయెదుటినుండి పొమ్ము." అని యోగి యనును. అపుడాతని మేఘగంభీరరవంబునెదుటను, విద్యుత్కాంతిగతి మెఱయులోచనస్ఫురణములయెదుటను నహంకార

మంతర్ధాన మగును. తత్క్షణమే యనంతుఁడాతనిదృష్టిపైఁ దటాలునఁ బ్రసరించును. జాజ్వల్యమాన మగునాదివ్యతేజము భయావహం బగును. ఈపరమధామ మాంతనియగాధములనుండి జీవాధారకశక్తి రూపమునఁ బొంగిపొరలుటయే గాక పైనుండి దివ్యజ్ఞానరూపమున సతతము వర్షించుచుండును. అదియే నలుప క్కల నుండి అతిసన్నిహితప్రియబంధువువలె సమీపించును. గం ర మగునంతరావలోకనముచే భాసమతిస్వచ్ఛమై భగవత్సన్నిధానవర్తిత్వ మతిమనోహర మగును. ఈసత్స్వరూపమును యోగి తిలకించినకొలఁది దాని ముఖ్యాకారలక్షణము లెక్కుడుస్పష్టముగ వ్యక్త మగును. కేవల సాన్నిధ్యానుభవం బిపుడు వ్యక్తిదర్శనంబుగా మాఱును. నరునకు గోచరమగునంతవఱకుఁ దద్గుణంబు లతిస్పష్టముగ గ్రహింపఁబడును. జ్ఞానలోచనగోచరం బగుజ్ఞాన మొకవంకను, పేమనేత్రగ్రాహ్యం బగుప్రేమ మొకవంకను, వివేకచక్షువ్యక్తం బగుపావనత్వ మొక వంకను, వీనికెల్ల నాధారభూతమై వెలయుసంకల్పశక్తి యనువ్యక్తి యీయన్నిటిమధ్యమునను గానంబడును. లోచనము కాంతితోడను, కర్ణము శబ్దముతోడను విచిత్రమగుపరస్పరసంబంధ మెట్లు కలిగి యుండునో యట్లే యహంకారవిరహిత మగుజీవాత్మయొక్కవివిధేంద్రియములును పరమాత్మయం దుండుతత్తద్గ్రాహ్యములచే నాకర్షింపఁబడి తత్క్షణమే స్వాభావికముగ వానితోఁ గలయును. యోగము క మముగ సిద్ధించుకొలఁది యాత్మబంధము లంతకంత కతిగాఢములై పరమాత్మను జీవాత్మలోని కాకర్షించును. యోగియొక్కక్షుద్ర మగునాత్మను క్రమముగ నాసర్వశక్తుఁడు జయించును. ఆతనిజ్ఞానము నాసర్వజ్ఞుఁడు కలవరపెట్టును. ఆతనిప్రేమ నాసర్వకారుణ్యుఁ డపహ

రించును. ఆతనివివేక మహాసర్వపరిశుద్ధుఁడు మిణుమిట్లుగొలుపును. ఇట్లు పరాజితుఁడై, పరాధీనుఁడై, పరవశుఁడై భక్తుఁడీశ్వరసాక్షాత్కారము నత్యవధానముతో ననుభవించును. తత్క్షణ మాతఁడీవిచిత మనోహరాకారునివదననిస్సృతంబగునవర్ణ్య లావణ్యముం జూచును. కాని తత్స్వరూప మిదమిద్ధమని నిరూపింప నెవరితరము? ఆతఁడు నిశ్చయముగ సుందరుఁడు; మనోహరధర్మమూర్తి; ఆనందమయుఁడు. కోటిసూర్యులనైన నిరసించునిజపవిత్రాపవిత తలచే నాతఁడు మనల దిగ్భ్ర మ నొందించి దుర్నిరీక్ష్యుఁ డయ్యెఁ గోటిచందు లనైన నపహసించుమనోహరదర్శనుండును, నానందదాయకుండును, శాంతాకారుండును, అమృతనిలయుండు నై విలసిల్లును. జనని, జనకుఁడు ; మిత్రుఁడు, ఉపదేశకుఁడు ; గురుఁడు, రక్షకుఁడు ; ఆశ్వాసకుఁడు, హార్దదుఁడు;—సర్వము నాతఁడే. "దివ్యస్మిత" మను నదియొకటియుండెనేని లలితమధురస్మితం బీజగన్మోహనాకారుని పెదవులపైఁ దాండవముసేయును. ఆతఁ డాధ్యాత్మిక సౌందర్యరాశి. జ్ఞానోపదేశక మగునాతనిదివ్యవాణియే యద్వితీయమగుదివ్యగానము. తత్సౌందర్యము దర్శించినవా రెవరు దాని మఱవఁగలరు? తన్మధుర స్వరమును వివేకమునుండి వినినవా రెవరు దానిని విడువఁగలరు? తన్మధురదర్శనామృతము నాస్వాదించినవా రెవ రాయమృతపాతమును త్యజింపఁగలరు? అది యెవ్వరికిని సాధ్యము గాదు. గాఢ యోగమం దాత్మ పరిపూర్ణమగుపారవశ్యముం జెందును. యోగి పరమాత్మలో గాఢముగ మగ్నుఁడై లేచి రాఁజాలఁడు. ఆతఁ డొకే వేళ తాఁ దలంచినను శాశ్వతదృఢబంధం బగుజనకునిగాఢాశ్లేషమును విడిపించుకొనఁజాలఁడు. నిత్యునితో నాతని కవినాభూతసంబంధ

మలవడుటచే నాతఁడు వాస్తవధ్యానమునఁగాని యేకాంతాను సంధానమునఁగాని మగ్నమైయుండకపోయినను, ఆతనిజీవితము క్షోభాకారము లగులౌకికకార్యములందుఁగాని, మహావిపత్తులందుఁగాని మునిఁగి తేలుచుండినను ఆతనియోగము వియోగ మెఱుంగనేరదు. పునఃపునరాచరితము లగుయోగాభ్యాసములచే నాప్రభు వాక్కాయా త్మలఁ బ్రతిష్ఠాపితుం డయ్యెనేని ఆతఁ డెల్లపుడుమనోహృదయము లందును, ఆత్మదేహములందును మాత్రమే కాక దైనికజీవితమందలి యత్యల్పవిషయంబులందుసైతము పరిమళతత్త్వమై వ్యాప్తిఁజెందును. ఆత్మపారిశుద్ధ్యంబును, ఆత్మశాంతియు యోగిజీవనము సంతను సురభితముఁ జేయును. మఱియు నాతనిమనోవాక్కాయకర్మంబులు దివ్య సౌరభసంవాసితంబు లగును. ఈశ్వరసమక్షమున నిరతము నివ సించుటంజేసి యాతఁడు క మముగ దివ జ్ఞానపరిపూర్ణుఁడై తుదకు నరత్వము విడిచి ఈశ్వరత్వము నొందును. స్థాయిభావము నొందిన యీయోగానుసంధానమె శాశ్వతజీవనము.ఇదియేనిజమగుభక్తుఁడు కాంక్షించుపరమపదవి. ఈయోగ మొసంగునానంద పవిత్రతా పర మపదంబులు జీవనకాంతిపూరంబులవలె నీయిరువదియవశతాబ్దంబు పై వెల్లివిరియునుగావుత !

ఓమ్

శాంతిః శాంః శాంతిః



# అనుబంధము.



1. హాక్స్లి
2. టిండాలు } :—వీరు పందొమ్మిదవశతాబ్దమందుఁ బ్రఖ్యాతిఁగాంచినపాశ్చాత్యప్రకృతిశాస్త్రవేత్తలు.

3. మోసెసు :—ఈతఁడు యూదీయధర్మశాస్త్రకారుఁడును, మహాత్ముఁడును.

4. జహోవా :—దేవుని హిందువులు "బ్రహ్మ" నియు, మహమ్మదీయులు "అల్లా" యనియుఁ బిలుచునట్లే యూదులు "జహోవా" యనిపిలుతురు.

5. జీససు :—ఈతఁడు క్రైస్తవమతస్థాపకుఁడును, ప్రపంచమందలి మహాత్ములలో నగ్రగణ్యులగువారిలో నొక్కఁడును.

6 జార్డన్ :—ఇది సిరియాదేశమందలిముఖ్యనదులలోనొక్కటి. దీని పావనసలిలములందు "జీసను" పరిశుద్ధస్నానమాచరించి దివ్యజ్ఞానము నొందినకారణమున నిది ధన్యతఁగాంచెను.